# పాఠశాలలందలి యాంధ్ర వ్యాకరణ బోధన

౨
విద్వాన్ శిరోమణి
సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి

మిగిలిన పాఠము లాకయెత్తు వ్యాకరణ పాఠ మొకయెత్తు మిగిలిన పాఠములకు వినియోగించిన కాలముకన్న వ్యాకరణ పాఠమునకెక్కువకాలమే వినియోగింపవలయును. మిగిలిన పాఠము అనుభవమునకు వచ్చినంత శీఘ్రముగా వ్యాకరణపాఠము రాదు కావున సాధ్యమైనంతవఱకు బాలురకుఁగల క్లేశము దొలఁగించు విధమున వ్యాకణము లుండవలయును అట్టియెడ నిప్పటివ్యాకరణములు బాలురకే కొలఁదిక్లేశమును దొలఁగింపక వారికింకను నధికక్లేశమును గూర్చుటకుఁ దోడ్పడుచున్నవని చెప్ప సాహసించుచున్నందులకుఁ దద్గ్రంథకర్తలు నన్ను మన్నింతురు గాక

వ్యాకరణ గ్రంథములలోఁ క్రియాంశము మ ముప్పాతిక మువ్వీసము దగ్గింపవలయును. ఎట్లన "పండుచున్నాఁడు" మొదలగు వర్తమాన కాలరూపము లను బోధించుటకు నాలుగైదు సూత్రము ల రచింపక "ధాతువులకు న్నాఁడు, చున్నారు మొదలగు ప్రత్యయములను జేర్చినచో వర్తమాన కాలరూపము లేర్పడును" అన్నఁజాలును. అట్లుగాక ధాతువునకు శ్నానుబంధము, చుగాగమము, దు రు మొదలగు ప్రత్యయములు పూర్వదీర్ఘము ఈప్రక్రియయంతయును జూపినచో విద్యార్థికిఁ క్లేశముగాదా? మరియు విభక్తి ప్రకరణములోఁ ప్రాచీన సాంప్రదాయానుసారముగా వచ్చు విభక్తి ప్రత్యయములనే కాక తదర్థ బోధకములగు నితర ప్రత్యయములను గూడ వ్రాయవలయును. "కొఱకు" అను వర్థమున కోసము, కోసరము, "కంటె"అను వర్థమున "కన్న" "వలన" అర్థమున వల్ల, అందు, అర్థమున "మీఁద" మొదలగునవి శిష్టకవి ప్రయుక్తములుగా నున్నవి ఏ వ్యాకరణ కర్తలును వీనినిఁ దమగ్రంథములలోఁ దడవరైరి. మరియుఁ గొన్నిమార్పులు చేయవచ్చును ఇదంతయును మధ్యమతరగతి వ్యాకరణమునఁ జేయఁదగిన మార్పులు.

ఇఁక ౪,౫,౬ ఫారములకుఁ దత్సమాచ్ఛిక భేదములు కళాద్రుత ప్రకృతి విభాగము తత్సమరూప నిష్పత్తి, సంధులు, భాషీయములు, లోకోక్తులు మొదలగునవి ఉత్తరోత్తర విపులీకరణ పద్ధతి ననుసరించి బోధింపవలయును. ఇచ్చట ప్రత్యేక మొక్కొక్క తరగతి కొక్క వ్యాకరణ ముండవలయును ఇచ్చటను వ్యావహారిక భాషా సంస్కారము లుండవలయును తత్సమాచ్ఛిక భేదములు తుణ్ణముగా నేర్పుట యెంతయుఁ గష్టము కావునఁ గొలఁదిగా నీక్రిందివిధముగా బోధింపవచ్చును

| | |
|---|---|
| అచ్ఛికము | తత్సమము |
| చెట్టు (ఏతదర్థబోధకమగు అచ్ఛికపదము. చెట్టు లేదు) | వృక్షము (ఏతదర్థబోధకములగు నన్యపదములన్నియు) |
| చెఱువు | తటాకము |
| ఇల్లు | గృహము మొ. పర్యాయపదములు |
| తోట } తోపు } | వనము మొ. ,, |
| తలుపు | ద్వారము మొ ,, |
| చిలుక | శుకము మొ. ,, |

ఈవిధముగా నాయర్థమును బోధించు నేపదములు కొలఁదిగా నుండునో వానిని నుదాహరించి దన్యములు తత్సమముల నియోఅచ్ఛిముల నిరయో చూపవచ్చును సమగ్రముగా పర్యాశబ్దములను మనము చూపఁజాలము కాని ౪,౫ నూర్ల పదములను జూపవచ్చును ౪,౫,౬ ఫారములలో నుత్తరోత్తరము విస్తరించిచూపుచుఁ బోయిన ౬వ ఫారము చదివినవానికి ౫౦౦ పదములైనను దెలియును, ఇప్పటి వ్యాకరణములలోఁజూపఁబడిన తత్సమాచ్ఛిక విభేద నిరూపణముకన్న నిది యుచితమేమోనని తలఁతును. అయినను విజ్ఞులు విమర్శింతురుగాక

భాషకు భాషీయములు ప్రాణవాయువు వంటివి. భాషీయములు సేకరించి వాని యర్థప్రయోగములను జూపుచు బోవలయును ఈసాధ్యముల భాషీయములను బాలురచే వ్యాసములయందుపయోగింప జేయవలయును అట్లే లోకోక్తుల నున్నచో వాని ప్రయోగములను బోధింపవలయును అరవఫారము చదివిన విద్యార్థికివిషయమంతయు వలియవలయును కళాశాలవిద్యార్థులకు నామమాత్రముగా వ్యాకరణము బోధింపబడదు కాని యచ్చటను ప్రాచీనాధునాతన కారకభేదములు, ప్రయోగ విశేషములు ప్రాచీన భాషీయపరిణామము (ఇదియొకయొత్తు అను నిప్పటిభాషీయము భారతమున "అదియొక తల, ఇదియొక తల"యని కలదు ఇట్టిపరిణామము) ను భాషాచరిత్రను ప్రక్రియాపూర్వముగా క్రియాపరిచ్ఛేదమును బోధింపవలయును.

నాబుద్ధికితాడృశమగు నుత్తరోత్తర విపులీకరణపద్ధతి ననుసరించి వ్యాకరణములు వ్రాయఁబడవలయునని తోఁచుచున్నది, మూఁడవఫారమునుండికే వ్యాకరణపఠనకుఁ బ్రధానముగాఁ గావలసిన విభక్తి క్రియా ప్రకరణములు సమగ్రముగా బోధింపవలయునని యెల్లరు సంగీకరింతు రిప్పు భాషాధ్యాపకులు నీ విషయము సమ్మతింతురు కాని యిప్పటి యున్నత తరగతులకు నుద్దేశింపఁబడి వ్రాయఁబడిన యాంధ్ర వ్యాకరణములవలన నైతము క్రియాజ్ఞానము సంపూర్ణముగా బాలురకు లభింపకున్నది మచ్చునకై తెలిపెదను.

ఈ సంవత్సరమున నిజాంరాష్ట్రమున నున్నత పాఠశాలా బాలురకై యేర్పఱుపఁబడిన వ్యాకరణ బోధినియను వ్యాకరణ గ్రంథమును బరిశీలింపుడు దీనిని మహా మహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, పింగళి లక్ష్మీకాంతముగారు మొదలగు మహావిద్వాంసులును, ఇచ్చటి కాలేజీ తెలుగు ప్రొఫెసరులును వేనోళ్ల ప్రశంసించియున్నారు. నాయట్టి యల్పజ్ఞుడీ గ్రంథమును విమర్శింపబూనుట కేవల సాహసము. కాని నాకుదోచిన దోషముల నెత్తి చూపింపకుంటయు మహాదోషమని విశ్వసించి యీకార్యమునకు దొరకొన్నందులకై విద్వాంసుల మన్నింప గోరుచున్నాను.

ఈ వ్యాకరణబోధిని యున్నత తరగతిబాలురకు (౪, ౫, ౬, ఫారములకు) నుద్దిష్టమైయున్నది ఇందాఱు పరిచ్ఛేదములు గలవు మొదట నక్షర పరిచ్ఛేదము, ౪వ ఫారము విద్యార్థికి అక్షర ప్రకరణ మారంభింపవలయును పిమ్మట నామవాచక లింగ వచనములు దెలుపవలయును. అట్లేని ౧, ౨, ౩ ఫారములలో నేర్చుకొనవలసిన వ్యాకరణమేమి? దానికిని దీనికిని గలభేదమేమి? పై తరగతులకు విశేషించి బోధించు విషయమేమి? మిగిలిన ప్రకరణములలో నెట్టి విశేషమును గావరాదు. ఇందలి క్రియాప్రకరణము పేర్కొనదగినది. ఈగ్రంథ మున్నత తరగతులకు నిర్దిష్టమైయున్నదని చెప్పియుంటిని ఈప్రకరణ మెంతయో సంగ్రహముగా నున్నది మూఁడవ ఫారమునకే తెలియవలసిన క్రియాభాగము ఈ గ్రంథమువలన అరవఫారము విద్యార్థికి గూడా లభింపదు ప్రతిభాషయందును సాధారణ క్రియలు, విశేషక్రియలు అని క్రియలు రెండుతరగతులుగా నుండును ఈరెండు తెగల క్రియలను మూడవఫారము విద్యార్థులకే సమగ్రముగా దెలియవలయును. ఈగ్రంథమున సాధారణక్రియలు మాత్రము జూపబడి విశేషక్రియలు విసర్జింపబడినవి. ఈ వ్యాకరణానుసారముగా నీక్రింది ధాతులరూపము లిట్లు నిష్పన్నములగును

| ధాతువు | ప్రార్థనార్థకము. | వ్యతిరేక ప్రార్థనార్థకము | |
|---|---|---|---|
| వచ్చు | వచ్చుము | వచ్చకము | వచ్చకుడు |
| ఇచ్చు | ఇవ్వుము | ఇచ్చకము | ఇచ్చకుడు |
| చూచు | | చూచకము | చూచకుడు |
| పోవు | పోవును (భూతము) | | |
| ఇచ్చు | ఇచ్చగం (భవిష్యత్తు) | | |
| ఉండు | ఉండుచున్నాడు (వర్తమానము) | | |
| చూచు | చూడుడు (వ్యతిరేకము) | | |
| అగు | ఆగెను (భూతము) | | |

ఈవిధముగా ప్రదోష తండములుగా నపభ్రంశరూపము లేర్పడును ఉన్నత తరగతి బాలురకేర్పఱుపబడిన వ్యాకరణమిది ఈబాలురకు క్రియాజ్ఞాన మెట్లు కలుగును? వీరు వ్రాసిన వ్యాసము లెట్లు నిర్దుష్టములుగా నుండును పరీక్షాధికారులు బాలుర వ్యాసాదులయందు దక్షులు గుప్పలుగానున్నవనియు వ్యాకరణ జ్ఞానము బాలురకు జాలా కొరవడియున్నదనియు వ్రాయ సాహసింతురు కాని యేర్పఱుపబడిన వ్యాకరణమెంత నిష్ప్రయోజనముగా నున్నదో చూడరు వినరు.

మిగిలిన ప్రకరణములలో నెట్టి విశేషములును లేవు. భాషీయములు, లోకోక్తులు, వ్యావహారిక భాషాసంస్కారము మొదలగువాని వాసనయు గానరాదు పుస్తకము మాత్రము చక్కగా ముద్రింపఁబడినది మూల్యమొకశ్రేణిను గుఱ్ఱము గుడ్డిదైనను దాణాదగ్గదు.

ఈ వ్యాకరణమును పెద్దపెద్దలందఱును బ్రశంసించిరి వారిద్దానినిజూచి యభిప్రాయమిచ్చిరో చూచికయే వ్యాకరణముగదా దీనివలన నాగ్నుపయోగముండకుండునా! అని విశ్వసించి యట్లు ముక్తాభిప్రాయము లిచ్చిరో తెలియదు. నాకు జూచి గ్రంథము నామూలాగ్రముగా విమర్శింపకయే యట్టి యభిప్రాయము లిచ్చిరని పొడవని అపేక్షల యభిప్రాయమును గాంచియే యిచ్చటి తెలుగు ప్రొఫెసరులును దీనిని బొగడియుండురని నా విశ్వాసము

విద్యార్థుల యుపయోగార్థము వ్రాయవలయునన్నచో నైని నాతెలిపిన విధముగా వ్యాకరణమును వ్రాయవలయును. అప్పుడు విద్యార్థులు ఆంగ్లభాషయందువలెనే ఆంధ్రభాషయందును నిర్దుష్టముగా భాషీయ,లోకోక్త్యలంకార భూయిష్టముగా వ్యాసములను రచింపగలుగుదురు

ఈ నాసూచించిన సంస్కారముకన్న నుత్తమ సంస్కారమును సూచించిన నేను శిరసావహింతురని పొడరోపాధ్యాయ పండితులకు మనవి సేయుచున్నాను

—

